# చదువుకుందాం పదండి

## అనియత విద్య స్టేజ్-1 గ్రామీణ బాలబాలికలు

రాష్ట్ర విద్యా శిక్షణ పరిశోధక సంస్థ ప్రచురణ
హైదరాబాదు

# చదువుకుందాం పదండి

(అనియత విద్య)

## గ్రామీణ బాల బాలికలు

### స్టేజ్ - 1



రాష్ట్ర విద్యా శిక్షణ పరిశోధనా సంస్థవారి
ఆధ్వర్యమున రూపొందించబడినది.

రాష్ట్ర విద్యాశిక్షణ పరిశోధనా సంస్థ ప్రచురణము
హైదరాబాదు.

# పీఠిక

రాజ్యాంగం ఉద్దేశించిన సూత్రాన్ని అనుసరించి 6-14 మధ్యవయస్సు గల పిల్లలందరకూ ఉచిత ప్రాథమిక విద్యను నేర్పాలి. కాని సాంప్రదాయిక ప్రాథమిక పాఠశాలలను అందరికి అందుబాటులో ఉండే విధంగా ఏర్పాటు చేస్తున్నప్పటికీ అనేక సాంఘిక, ఆర్థిక కారణాలవల్ల చాలామంది పిల్లలు ఈ బడులలో చేరలేక పోతున్నారు. చేరిన వారిలోకూడా ప్రాథమిక విద్యనుపూర్తి చేయలేక పోతున్నవారు చాలమంది ఉన్నారు. ఇందులో హరిజనులు, గిరిజనులు, బడుగుజాతులు, ఆడపిల్లలు ఎక్కువమంది. ఇటువంటి పిల్లలందరికి చదువు అందుబాటులో ఉండేటట్లు చేయడానికి అనియత విద్యా విధానం ఒక మార్గం. ఇందులో విద్యార్థికి అవసరమైన చదువును అతనికి అనుకూలమైన సమయంలో, స్థలంలో నేర్పగలగడం ఒక ప్రత్యేకత.

ఈ అనియత విద్యకోసం పాఠ్యపుస్తకాలు రూపొందించ బడ్డాయి. ఈ పుస్తకాలు అనియత విద్యావిధానంలోని విద్యార్థులకు, ఉపాధ్యాయులకు ఉపయోగ కరంగా వుండగలవనిన్నీ, వీటిద్వారా నేర్పే అంశాలు పిల్లల దైనందిన జీవితంలో ఉపకరించ గలవనీ ఆశించ బడింది.

పనస

నగ

పలక

వల

మర్రి

వంకాయ

స న ప వ మ య

మన నస వస వన మయ యమ పనస

పసపస మనపస నపనస

మన పనస

తల

అరటి

తడక

గంట

ఆవు

పార

ల ట అ ఆ త ర

ఆట తన నవల మనఆట పటపట

అర తమ వరస తనఆట వలవల

వల ఆకు సమత తనతల తటతట

తల రమ మమత రమతల అలసట

లయ మర సవర

ఈగ

ఈక

పడవ

ఉడత

ఊయల

గాడిద

గ ఈ డ ఉ ఊ ద

| | | | | |
|---|---|---|---|---|
| ఈగ | ఊట | ఊయల | మడత | ఈగ తల |
| ఈల | ఊడ | ఊదర | ఉడత | ఈ పడవ |
| ఈత | ఉమ | పడగ | పడవ | గలగల |
| నగ | గడ | గడప | | మన పడవ |
| పగ | గద | ఉలవ | | ఉమ పడవ |

ఇల్లు

బాణం

ఈక

చక్రం

ఇ ణ క చ

| | | | |
|---|---|---|---|
| ఈక | నలక | పడక | పకపక |
| ఊక | నడక | పరక | గణగణ |
| కల | కడవ | కమల | గలగల |
| ఇసుక | కలప | చదర | కలకల |
| మరక | కలత | ఇచట | చకచక |
| తడక | మర పడవ | అచట | కరకర |
| ఈ పలక | ఆ కడవ | ఆ పలక | ఈత తడక |
| ఈ కడవ | | కమల పలక | |

ఈ పలక కమల పలక ఆ తడక ఈత తడక

ఒకటి

ఓడ

బర్రె

జడ

**ఒ ఓ బ జ**

ఒక
ఓడ
ఓర
జత
జడ
జయ

బరువు
బయట
బరక
జలగ
జలజ

జరజర
జలజల
మన ఓడ
ఒక నగ
నగల జత
కమల జడ
అరకల జత
పలకల జత

ఆ పలక జయ పలక
ఈ ఇసుక బరక
ఈ అరక మన అరక
ఈ నగ కమల నగ

ఎ లు క

ఏనుగు

వేషం

తాళం

ఎ ఏ ష ళ

వర
ఎర
ఎడమ
ఉష
ఊళ

కళ
తళతళ
కళకళ
ఉష జడ

మన ఉష
ఉష పలక
సరళ పలక
ఆటల అలసట

బడబడ
దడదడ
గడగడ
సరళ నటన
ఈ ఆట ఏ ఆ
నటన ఒక కళ

ఈ పలక సరళ పలక

ఈ తడక ఊత తడక

గంప

మంట

| | | | |
|---|---|---|---|
| పంట | ఎండ | కలం | మనం అందరం |
| వంట | సంత | మండ | కండబలం |
| జంట | వంగ | అండ | గంటల దండ |
| దండ | గంగ | పండగ | ఈత గంప |
| కండ | మంద | దండకం | గంట గణగణ |
| బండ | బలం | జగడం | ఈగంప ఈతగంప |
| కంప | మనం | పంజరం | జన గణ మన |
| | | బలగం | |
| | | అందరం | |

హంస

శంఖం

| | | | | |
|---|---|---|---|---|
| ఊహ | హటం | శరం | వంశం | కలశం |
| హలం | ఇహం | శకం | అంశం | శంకరం |
| హరహర | అహం | దశ | ఆశ | ఈ దశ |
| | | | వశం | |

ఈ శకం జనశకం చదవటం మన ఆశయం మన వంశం

| వంకాయ | | పొర | చందమామ | |
|---|---|---|---|---|
| కాప | వాన | పాప | మాట | కాకరకాయ |
| గాడ | తాత | పాట | మాయ | బావమాట |
| చాప | వాసన | పాగ | మామ | మాయమాట |
| చాప | కాగడ | పాత | యాతం | మా అరక |
| జాప | జాతర | సాన | యాతన | తామరకాడ |
| జామ | బంగారం | సారం | తమాషా | యమయాతన |
| బావ | వాక | సంసారం | టమాటా | వావాకాలం |
| బాల | గాళం | పాతర | సమానం | ఎండాకాలం |
| చాల | తామర | మసాలా | | టమాటారసం |
| రామ | వావ | వసారా | | |
| | శారద | సాగరం | | |
| | శాంతం | జాగరం | | |

ఈ పలక నా పలక

ఆ పలక శారద పలక

ఈ కాలం వావాకాలం

ఈ కాలం ఎండాకాలం

మా పాప బంగారం

ఆ పాట పాత పాట

ఆ కాడ తామర కాడ

అందరం సమానం

చిలక

చీమ

| | | | | |
|---|---|---|---|---|
| పంది | ఇటిక | చీర | చీకటి | ఇది మా బడి |
| వరి | పందిరి | చీడ | చీదర | అది నీలి చీర |
| గంజి | సందడి | బీర | తీరిక | ఇది గిలకల బావి |
| కాకి | మామిడి | తీగ | మీగడ | ఈ తీగ బీరతీగ |
| గాలి | మిరప | సీత | పీలిక | రామం మంచి మనిషి |
| మంచి | చిలక | పీట | నిజాయితి | |
| వాణి | ఆకలి | సీడ | పంచాయతి | పాపాయి |
| రాణి | విమల | తీపి | గిలకల బావి | బాబాయి |
| ఇది | మనిషి | గీత | గాలివాన | సిపాయి |
| అది | బాలిక | జీడి | పరిమడి | కసాయి |
| ఏది | బటాణి | రీడు | బీరతీగ | సిపాయిలు |
| బండి | షికారు | వీణ | ఇంటివాకిలి | |
| బావి | వాకిలి | మీద | జీవనం | |

కావలి     మీసం     లీల, గీత మంచి జంట

ఉగాది     బడికి రండి     బాగా చదవండి

మంచిమాట వినండి     నిజం పలకండి

పాము

ఆవు

దూడ

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఊరు | తుపాకి | పులి | పావురం | మూడు | నూగు |
| వారు | కబురు | తపుడు | అడవులు | మూత | నూలు |
| గుడి | కుటుంబం | పులుపు | కురుపులు | దూరం | నూరు |
| కాలు | గాజులు | పులుసు | పశువులు | దూలం | బూజు |
| పాలు | ముసుగు | పసుపు | కూలి | కూరలు | బూరుగు |
| బాతు | మురికి | చదువు | సూది | కూతురు | వసూలు |
| తాడు | పంతులు | కలుపు | గూడు | పూజ | |
| మునగ | గునపం | బరువు | మూట | పూలు | |

ఆముదం

పులిచారలు

ఆవుదూడ

ఆవుపాలు

కాకిగూడు

వాగునీరు

మావూరు

పులుసు కూర

ఉగాది పూజ

పూలు పూచినవి

పులి అడవి జంతువు

అడవులను కాపాడు

గులాబి పూవు ఎరుపు

ఆవుపాలు మంచివి

ఆకు కూరలు మంచివి

పాము కాటు విషము

బీర పూలు పసుపు

నెమలి

మేడ

మేక

| | | | | |
|---|---|---|---|---|
| మేడ | సెలవు | మేడ | నేల | కుందేలు |
| గెల | పందెం | కేక | చేను | తాంబేలు |
| వెల | వెలుగు | జేబు | వేషం | వేరుసెనగ |
| నూనె | వెలుతురు | వేప | వేరు | నేతచీర |
| చెంబు | వెదురు | చేప | రేపు | తీపి పెరుగు |
| గుడిసె | పూరిగుడిసె | వేరు | రేగు | చేప నూనె |
| వెలుగు | వెలగకాయ | తేనె | పాలేరు | వేపకాయ |
| తెలుగు | బెండకాయ | చేమ | | చేతిపనులు |
| తెలుపు | సెనగపంట | మేలు | | సిమెంటురేకు |
| గెలుపు | జెండాపాట | వేడి | | కరెంటుతీగ |
| చెరువు | నెమలికూత | దేశం | | తెలుగు దేశం |
| చెరకు | తెలుగుమాట | | | తేనెటీగలు |
| | | | | వేగుజాము |

చెడు చేయకు
చెడు వినకు
చెడు చూడకు
చెడు మాటాడకు
జెండాపాట పాడుదాం
వేపకాయ చేదు

రేపు సెలవు దినం
వేగుజామున నిదురలే
చేపనూనె బలము
తేనె తీయన
పేదలను దయగా చూడు
అది పూరిగుడిసె

గొడుగు

గోళి

కోడి

దోశ      పొగ      కోతి      సోము      సంతోషం
కొండ      పొలం      తోట      పోత      సగము బలం.
కొడుకు      పొగను      గోడ      గోలి      మురికి చేయకు.
కొడవలి      పొడుగు      నోరు      కోపము      మురికి దోమలను
గొలుసు      కోడికూత      రోలు      పోషణ      పెంచుతుంది.
కొండగాలి      గోదావరి      దోమ      రోకలి      పొదుపు చేయండి.
సంతోషం      సంతోషం      లోతు      కోటు
కోయదొర      గోవు      జోలపాట      గోరు
కోకిల      గోపురం            దోమకాటు
కోవెల

మొసలి

మోటారు

మొల మొలతాడు మొహం మొదలు మొదటి మొలక మోటు
మోటారు మోపు మోసం రేడియో మోత మోకాలు
ఎవరినీ మోసము చేయకు      రోజు రేడియో విను
పని మొదలు, మాట పిదప

సైకిలు

గౌను

| | | | |
|---|---|---|---|
| రైతు | తైలం | నౌక | పౌరుడు |
| రైలు | టైము | నౌకరు | పౌరుషము |
| వైరు | పైకం | చౌక | |
| పైరు | రైతుపొలం | గౌరవం | |
| టైరు | సైగ | గౌను | |
| పైసా | హైదరాబాదు | పౌడరు | |
| మైదా | మైదాపిండి | సౌదామిని | |
| మైనం | సైకిలుటైరు | | |

దేశ గౌరవం

దేశ గౌరవం కాపాడు

హైదరాబాదు అందమైనది

మంచి పౌరుడు

పేదవారిపై దయచూపు

నేను మంచి పౌరుడను కావాలి

ఈ టైరు సైకిలు టైరు

టైముకు బడికి పో

పైసా దాచి పైకం పెంచు

| | | | | | |
|---|---|---|---|---|---|
| క | ్క | తుక్క | త | ్త | సత్త |
| | | అక్క | | | అత్త |
| | | మొక్క | | | కొత్త |
| | | పక్క | | | విత్తనం |
| | | చెక్క | | | మెత్తన |
| | | పక్క | | | చెత్త |
| న | ్న | దున్న | మ | ్మ | గుమ్మడి |
| | | అన్న | | | అమ్మ |
| | | నిన్న | | | బొమ్మ |
| | | వెన్న | | | కొమ్మ |
| | | జొన్న | | | తుమ్మ |
| | | సున్నం | | | నిమ్మ |
| య | ్య | కొయ్య | ర | ్ర | గుర్రం |
| | | అయ్య | | | కర్ర |
| | | బియ్యం | | | ఎర్రన |
| | | తియ్యన | | | తొర్ర |
| | | పెయ్య | | | బొర్ర |
| | | రొయ్య | | | |
| ల | ్ల | బిల్ల | వ | ్వ | గువ్వ |
| | | పిల్ల | | | అవ్వ |
| | | అల్లరి | | | రవ్వ |
| | | బెల్లం | | | కవ్వం |
| | | అల్లం | | | గవ్వ |

మొగ్గ

కప్ప

గొడ్డలి

బుగ్గ
పగ్గం
ముగ్గం

తెప్ప
చిప్ప
రెప్ప

గుడ్డ
గడ్డ
అద్దము

బుట్ట
పిట్ట
తట్ట
బట్ట
అట్ట

గద్ద
బద్ద
ముద్ద
పెద్ద

దెబ్బ
దిబ్బ
రిబ్బను
దబ్బనం

బచ్చలి
వెచ్చని
పచ్చని
రచ్చబండ

లెస్స
విస్సమ్మ
మిస్సమ్మ

అమ్మ, బొమ్మ
ఎర్రగుడ్డ
అన్నంముద్ద
కొయ్య బల్ల

నిమ్మకొమ్మ
తెల్ల గవ్వ
జొన్న మొక్క
కొబ్బరి మట్ట

వచ్చని బచ్చలి
మిస్సమ్మ పెయ్య
తెల్ల బియ్యం
పెద్ద గుడ్డముక్క

అద్దంలో నీ బొమ్మ చూచుకో
ఎర్రరిబ్బను తీసుకురా
దిబ్బ అడ్డంగా ఉన్నది
కొబ్బరి మట్టలు కొట్టకు

గ ్గ     డ ్డ     ద ్ద     చ ్చ
మ ్మ     ట ్ట     బ ్బ     ప ్ప

| | | | | |
|---|---|---|---|---|
| పిచ్చుక | పిచ్చిక | మిక్కిలి | మజ్జిగ | |
| మచ్చ | ఉచ్చ | చక్కెర | గుజ్జు | |
| గద్ది | సిగ్గు | కత్తి | గజ్జి | |
| గొడ్డు | బొగ్గు | కత్తెర | గుట్టు | పొద్దు |
| లడ్డు | ముగ్గు | సత్తువ | రొట్టె | అద్దె |
| బొడ్డు | రగ్గు | చిత్తూరు | మట్టి | మద్దెల |
| తన్ను | అప్ప | మర్రి | పట్టా | పెద్దోడు |
| వెన్నెల | ఉప్ప | గొర్రె | పిల్లి | డబ్బు |
| పిన్ని | దుప్పి | బుర్రుపిట్ట | ముల్లు | డబ్బా |
| మున్నూరు | అప్పాజి | తుర్రుపిట్ట | చెల్లెలు | గబ్బిలం |
| గొయ్యి | పళ్ళెం | గూళ్ళు | బుల్లోడు | అబ్బే |
| పొయ్యి | సీళ్ళు | వేళ్ళు | కుందేళ్ళు | |
| ఉయ్యూరు | గొళ్ళెం | కుళ్ళు | పెళ్ళి | |

పొద్దుననే లే

అవ్వచేసి పప్పుకూడు

తాడిచెట్టు మట్టలు కొట్టు

| | | | |
|---|---|---|---|
| | ముల్కీ | ష్ట | కష్టం, ఇష్టం |
| ట్కా | చిట్కా | | నష్టం |
| | జట్కా | స్ట | మాస్టరు |
| ల్క | శిల్క | క్ట | డాక్టరు, యాక్టరు |
| ర్కా | సత్కారం | క్టో | అక్టోబరు |
| ర్కె | మార్కెటు | | |
| స్కా | నమస్కారం | | |
| | చమత్కారం | ర్డు | కార్డు, బోర్డు |
| ర్గా | దుర్గా | ల్డా | డాల్డా |
| ర్గ | దుర్గ, మార్గం | స్త | పుస్తకం, విస్తరి |
| ర్చ | చర్చ, అర్చన | స్తి | ఆస్తి |
| ర్చి | చర్చి, మిర్చి | | |
| | మార్చి | | |
| ర్చీ | కుర్చీ | స్తే | పుస్తే |
| ర్చు | నేర్చు | స్తీ | బస్తీ |
| ర్చా | కూర్చాను | క్త | రక్తం |
| ర్జీ | దర్జీ | స్తూ | దస్తూరి, కస్తూరి |
| ర్జా | [illegible]ర్జా | స్తా | వస్తాడు, వస్తాదు |

| | |
|---|---|
| స్తు | వస్తువు |
| ప్త | సప్తమి |
| స్నా | స్నానం |
| స్నే | స్నేహం |
| ర్నూ | కర్నూలు |
| ర్నా | మర్నాడు |
| ట్న | పట్నం, రాట్నం |
| ర్పు | నేర్పు |
| | మార్పు |
| | తీర్పు |
| | తూర్పు |
| ర్పా | ఎర్పాటు |
| ల్పు | కల్పు |
| క్బ | అక్బరు |
| ల్బ | బల్బు |
| ర్మ | చర్మం |
| స్మ | స్మరణ |
| క్మి | రుక్మిణి |
| ద్య | పాడ్యమి |
| ట్య | నాట్యం |
| ర్యా | మర్యాద |
| వ్యా | అవ్యాయం |
| ద్యో | ఉద్యోగం |
| క్ర | శుక్రవారం |
| క్రి | క్రిమి |
| త్రి | రాత్రి, ఆసుపత్రి |
| ద్ర | ముద్ర |
| బ్ర | బ్రతుకు |
| ద్రు | చంద్రుడు |
| త్స | సంవత్సరం |
| ర్సు | నర్సు, పర్సు |
| ప్రే | ప్రేమ |
| గ్లా | గ్లాసు |
| ట్లా | అట్లా. ఇట్లా |
| ట్లు | చెట్లు |

| | |
|---|---|
| జ్వ | జ్వరం |
| ర్వ | పూర్వం |
| | గర్వం |
| శ్వ | ఆశ్వయుజం |
| క్ష | అక్షరం, పక్షం |
| | యుంతక్షను |
| క్షా | రిక్షా |
| క్షి | పక్షి |
| ర్ప | సర్పం |
| ర్శ | ఆదర్శం |
| ర్శి | కార్యదర్శి |

ఐదు, ఐదుదూపాయలు, ఐకమత్యం, ఐక్యత

ఐకమత్యమే బలం.

ఔటు, ఔను, ఔరా, ఔన్నత్యం.

దేశౌన్నత్యానికి పాటుపడు.

పాఠం, కంఠం, మఠం

పాఠం పదిసార్లు చదువు.

రాధ, బాధ, బోధన, బాధ్యత, ధనం, ధైర్యం

ఉపాధ్యాయుడు, బుద్ధి, ధాన్యం, నీటిధార, మధ్య

గాంధీతాత,

గాయం బాధ వేసింది

ఆకలి బాధ అతి కష్టమైనది

భర్త, భార్య, లాభం, శుభం, భోజనం

శుభ్రం, భయం, భార్యాభర్తలు

మీకు శుభం కలగాలి

ఇది లాభసాటి బేరము

ఇదిని శుభ్రంగా ఉంచండి

నిజం చెప్పటానికి భయపడకు

హారం, సలహా, మహిళ, ఆహారం, మహాత్ముడు

కంఠహారం, మహిళా మండలి, గాంధీమహాత్ముడు

| | | |
|---|---|---|
| మంచిమాట | పొలం పని | తెల్లగా |
| గాలివాన | కాడెద్దులు | నల్లగా |
| బంజరుభూమి | జోడెద్దులు | గుండ్రంగా |
| కూరగాయలు | పంటకాలవ | చదరంగా |
| అన్నదమ్ములు | పేదవాళ్ళు | కోలగా |
| అక్కచెల్లెళ్ళు | కొబ్బరి పీచు | వంకరగా |
| పాడిపంటలు | కొత్తవంచ | సూటిగా |
| బావినీళ్ళు | పూరిపాక | చదునుగా |
| మామిడితోట | మెట్టపైరు | పొడుగ్గా |
| వరిపొలం | అగ్గిపెట్టె | వెడల్పుగా |
| జొన్నచేను | ఎండుగడ్డి | ఎత్తుగా |
| నల్లరేగడి | ఇంటావంటా | పల్లంగా |
| వీధిదీపాలు | తెక్కలూ పక్కలు | తియ్యగా |
| కోడిగుడ్డు | వడ్లగింజ | పుల్లగా |
| మిరపకాయ | చక్కని | ఒత్తుగా |
| మల్లెపువ్వు | చల్లగా | తక్కువగా |
| వారుమడి | మెల్లగా | ఎక్కువగా |
| మోటబావి | తొందరగా | త్వరగా |
| | చిన్నగా | పూర్తిగా |
| | పెద్దగా | |

సీత బడిలో చదువుతున్నది .

నాగయ్య పొలం దున్నుతున్నాడు.

సోమయ్య దూడలను కడుగుతున్నాడు.

కూలీలు వరి కోస్తున్నారు.

రామయ్య బండి తోలుతున్నాడు.

వాళ్ళు నాట్లు వేస్తున్నారు.

అమ్మ అన్నం వండుచున్నది.

రామమ్మ పాలు పితుకుతున్నది.

సోమయ్య కుండలు చేస్తున్నాడు.

మా అయ్య బస్సు ఎక్కి పట్నం పోయినాడు.

అమ్మ చెల్లాయికి జడ వేస్తున్నది.

మా ఊరికి కరెంటు వస్తుంది .

మా ఊరికి రోడ్డు వేస్తున్నారు.

గోపయ్యకు ఆరు మేకలు ఉన్నాయి.

మా ఊరిలో ఆసుపత్రి ఉన్నది.

దీపావళి పండగ వచ్చింది .

పోలయ్య నాగలి చేస్తున్నాడు

ప్రకాశం పంతులుగారు గొప్ప నాయకుడు

ఇతడు రంగారెడ్డి. ఇతడు ఒక రైతు పొలంలో పంటలు పండిస్తాడు. అతనికి రెండు ఎద్దులు, మూడు ఆవులు, రెండు బర్రెలు ఉన్నాయి. రైతు దేశానికి వెన్నెముక వంటివాడు.

ఇది నాగలి. దీనితో పొలం దున్నుతారు. నాగలికి ఎద్దులుగాని దున్నలుగాని కట్టుతారు. రైతుకు నాగలి చాల అవసరం. కొయ్య నాగలి కంటె మర నాగలి చాల మంచిది.

ఇది ఎడ్ల బండి. దీనిని కలపతో చేస్తారు. ఈ బండిని రెండు ఎడ్లు లాగుతాయి. పొలాల నుండి గడ్డి, ధాన్యం బండిలోనే వేసుకొని రైతు ఇంటికి తెచ్చుకుంటాడు. ధాన్యం రవాణాకు రైతు బండిని ఉపయోగిస్తాడు.

ఇది జొన్న. జొన్న మెట్టపంట. జొన్నలు మంచి బలము ఇచ్చే ఆహారం. జొన్న చొప్ప పశువులకు రుచికర మైన మేత.

ఆవు సాధు జంతువు. అది పచ్చిగడ్డి, ఎండు గడ్డి, తింటుంది. పాలు ఇస్తుంది. ఆవుపాలు చాల మంచివి. చాల ఆరోగ్యమైన ఆహారం.

వడ్రంగి కొయ్యతో సామానులు తయారు చేస్తాడు. రైతుకు కావలసిన బండి, నాగలి మొదలైన పనిముట్లు తయారు చేస్తాడు. ఇంటికి కావలసిన వాసాలు తలుపులు, కిటికీలు, దూలాలు ఇతనే తయారుచేస్తాడు.

ఇది కొబ్బరి చెట్టు. ఇసుక నేలలో బాగా పెరుగుతుంది. కొబ్బరి కాయల నుండి కొబ్బరి తీస్తారు. ఎండు కొబ్బరి నుండి కొబ్బరి నూనె తీస్తారు. కొబ్బరి పీచుతో తాళ్ళు కూడ పేనుతారు. ఆకులతో చాపలు అల్లుతారు.

# ఉగాది

ఆరోజు ఉగాది. కొత్త సంవత్సరానికి మొదలు.

సీతా గోపి పొద్దున్నే లేచారు.

తలంట్లు పోసుకున్నారు.

క్రొత్త బట్టలు తొడుగు కున్నారు.

గోపి వేప పూలు తెచ్చాడు.

సీత పూలదండ కట్టి గుమ్మానికి కట్టింది.

అప్పటికి అందరూ స్నానాలు చేశారు.

అమ్మ ఉగాది పచ్చడి చేసింది.

అందరికి ఇచ్చింది.

అందరూ చాల సంతోషంగా ఉన్నారు.

అమ్మ రకరకాల పిండివంటలు చేసింది.

సీతకు తీపి చాల యిష్టం.

గోపికి గారెలు అంటే యిష్టం.

అందరూ హాయిగా భోజనాలు చేశారు.

సాయంత్రం సీతా గోపి, స్నేహితులతో ఆడుకున్నారు.

అమ్మా నాన్న గుడికి పోయారు.

అక్కడ రామయ్యగారు పంచాంగం వినిపించారు.

ఆ రోజు గ్రామవాసులకు ఎంతో ఆనందంగా గడిచిపోయింది.

సంవత్సరం అంతా అట్లే ఆనందంగా ఉండాలి అని అంతా కోరుకున్నారు.

# అంకెలు (గేయం)

బాలయ్య కున్నది బండి ఒక్కటి 1
ఆ బండి కున్నవి చక్రాలు రెండు 2
మస్తాను కున్నాయి మేకలు మూడు 3
ఆ మేకలకు తోడు గొర్రెలు నాలుగు 4
కోటమ్మ కున్నాయి కోళ్ళు ఐదు 5
బాలమ్మ కున్నాయి బాతులు ఆరు 6
సుబ్బయ్య కున్నాయి గునపాలు ఏడు 7
గోపయ్య కున్నాయి గొడ్డళ్ళు ఎనిమిది 8
కొమరయ్య కున్నాయి కొడవళ్ళు తొమ్మిది 9
పోశయ్య కున్నాయి పారలు పది 10

సర్పంచ్ సత్తెయ్య మునసబు ముసలయ్య, మోతుబరి మంగయ్య గ్రామ వాసులు కూడి ఐక్యతగ ఉంటారు మన పల్లెలోన.

ఒకటి రెండు మూడు
చేయి చేయి కల్పిచూడు॥
నాలుగు అయిదు ఆరు
కల్సి ఉంటే లేదు పోరు॥
ఏడు ఎనిమిది తొమ్మిది
నేర్చుకో ముందు నెమ్మది।
ఆఖరిదీ పాఠంలో పది
అంతటితో ఆగకు మరి॥

# మంచి దారి

రంగడు : గోపీ ! గోపీ !!....త్వరగా రారా !

గోపి : ఏరా? ఎందుకట్లా కేకలేస్తావు?

రంగడు : బడికి వేళయిపోయింది. త్వరగారా! ఈవేళ మనం కూడా మిఠాయి తిందాం !

గోపి : డబ్బు లెక్కడివి ?

రంగడు : మా అయ్య జేబులోంచి రూపాయి తీశాను.

గోపి : మీ అయ్యను అడగకుండ తీయటం చాలా తప్పు! ఇలాంటి తప్పు పని ఎందుకు చేశావు ?

ర: వాళ్ళంతా మిఠాయి కొనుక్కు తింటూ రోజూ నన్ను ఊరిస్తున్నారు. ఈ రోజు ఎట్లాగైనా వాళ్ళందరిని ఊరించాలని డబ్బులు తెచ్చాను.

గో: నువ్వు రూపాయి దొంగతనం చేశావు.

ర: దొంగతనమా! నేను దొంగనా? నేను దొంగతనం చేశానా? మిఠాయి తినాలని డబ్బులు తీశాను. దొంగతనం చెయ్యాలని కాదు.

గో: మిఠాయి....మిఠాయి. అంటావు. ఆ మిఠాయి నేను తిన లేక కాదు. రోజూ చూస్తున్నాను, వాటి మీద ఎన్నో ఈగలు వాలుతూంటాయి. అలాంటి మిఠాయి తింటే రోగాలొస్తాయి.

ర: ఏమిటి మిఠాయి తింటే రోగాలా ?!

గో: మా పక్కింటి రాముకు ఆ మిఠాయి తినబట్టే మొన్న వాంతులు పట్టుకున్నాయి.

ర: ఏమిటి! అవి తింటేనే వాంతులు పట్టుకున్నాయా?

గో: ఈగలు మురికి గుంటలపై వాలి యీ మిఠాయి మీద వాల్తాయి. అలాంటివి తింటే రోగాలు రావా ఏం ?

ర: అలాంటి మిఠాయి కోసం నేనెంత తప్పు పని చేశాను ఇప్పుడేమి చేయటం?

గో: మీ అయ్య దగ్గరకెళ్ళి నిజం చెప్పేసెయ్ !

ర: అమ్మో! నన్ను కొడతారు.

గో: నిజంచెప్తే ఏమీ అనడు. చేసిన తప్పు ఒప్పుకోవటమే మంచిపని.

ర: నీమాటమీద వెళ్తున్నాను. మాఅయ్య ఏంచేస్తాడో ?

నా: ఏరా ! రంగా ? - ఈ వేళ బడికి వెళ్ళలేదా ?

ర: వెళ్తానయ్యా, అయ్యా! నేనో తప్పుపని చేశానయ్యా, నన్నేమి అనవు కదా.

నా: ఏమిట్రా అది ?

ర: తెలియక చేశానయ్యా

నా: ఏమిట్రా, ఏంచేశావు ?

ర: బడివదలగానే కొందరు పిల్లలు మిఠాయి కొనుక్కుంటూ ఉంటారు. నేను మిఠాయి కొనుక్కోవాలని నీ జేబులోంచి రూపాయి తీశాను. తెలియక తప్పు చేశాను. యింకెప్పుడూ యిలాంటి పనిచేయను.

నా: నువ్వు నిజం చెప్పావు. చేసిన తప్పు ఒప్పుకున్నావు. నాకు చాల సంతోషంగా ఉంది. నిన్నేమి అనను. ఆ రూపాయి పెట్టి మిఠాయి కొనుక్కో.

రంగడు : వద్దయ్యా, వాటి మీద మూతలుండవు. ఈగలు వాల్తుంటాయి. అలాంటివి తింటే రోగాలొస్తాయి.

నారాయణ : పోనీలే ఆరూపాయి దాచుకో.

రంగడు : నువ్వు చాల మంచోడివి నాన్నా!

తప్పు చేయటం సహజము

సరిదిద్దుకొనుటే సమంజసం

# మన దుస్తులూ - జాగ్రత్తలూ

సరళకు పట్నం అంటే మోజు అక్కడ పెద్దబజార్లు ఉంటాయి. ఎన్నో షాపులుంటాయి. మంచి మంచి రిబ్బన్లు కొనుక్కోవచ్చు. తళతళ మెరిసే బట్టలు కొనవచ్చు. అందుకని ఒకసారి అమ్మతోకూడ పట్నం వెళ్ళింది. రిబ్బన్లేకాదు ఒక లంగా కూడా కొనుక్కొచ్చుకుంది.లంగా నిగ నిగ మెరుస్తున్నది నైలాన్ లంగా అది నూలుదికాదు. త్వరగా మాయదు. మాసినా, సబ్బు నీళ్ళలో ఉతికితే తొందరగా మైల పోతుంది. ఎంత తేలికగా ఉందని! పట్నంలో అత్త ఇవన్నీ చెప్పింది. అత్తే అంగట్లో కొని యిచ్చింది.

సరళ కొత్త లంగా కట్టుకొని బడికివెళ్ళింది. "సరళా, కొత్త లంగా వేసుకొచ్చావే! మీ నాన్నగారు పట్నంనించి తెచ్చారా?" అని టీచరు అడిగింది. "మా అత్త కొనిచ్చింది టీచర్"అంది సరళ. ఇది నైలాన్ బట్ట.మనం మామూలుగా తొడుక్కునే నూలు బట్ట కాదు. చూడటానికి ఎంతో బాగుంటుంది. అయితే దగ్గరికి ఈ బట్టలతో వెళ్ళినప్పుడు జాగ్రత్త సుమా!ఈ కొత్త రకం బట్టలు అంటుకుంటే ఆరిపోవు. ఒంటికి కరుచుకొని ఒళ్ళు కాలిపోయే ప్రమాదం ఉంది. వంటచేసేటప్పుడూ, మంటల దగ్గరున్నప్పుడూ ఎంతో జాగ్రత్తగా ఉండవలె." అన్నది టీచర్.

"మీరు చెప్పింది మా అమ్మకు చెప్తాను. నేనూ జాగ్రత్తగా ఉంటాను,టీచర్"అన్నది సరళ. ఆ సాయంకాలం రేడియోలో "టెరిలిన్ బట్టలూ, నైలాన్ చీరలూ కొనండి" అనే ప్రకటన వినిపించింది; సరళకు టీచర్ చెప్పింది గుర్తుకు వచ్చింది. సరళకే కాదు అందరికి గుర్తుండవలసిన విషయమది. పిల్లలకూ, పెద్దలకూ కూడా।

# ఆరోగ్యము - ఆహారము

మంగమ్మ : ఏమి రాములమ్మా, ఎక్కడికి బయలు దేరావు?

రాములమ్మ : ఎక్కడికో కాదమ్మా, మన హెల్తు సెంటరుకు. డాక్టరమ్మ వారం వారం రమ్మంది.

మంగమ్మ : పోయిన వారం మీ పాపకు నంజుఅన్నావు గదా! ఇప్పుడు ఎట్లా గుంది?

రాములమ్మ : ఎట్లా ఉందని చెప్పనమ్మా. పనికేమో పోక తప్పదుగదా. పాపకు నడక వచ్చింది-పెద్దపిల్లే చూచుకోవాలి.

మంగమ్మ : అవునులే, మనం అందరం చేసేది అదే గదా,

రాములమ్మ : ఆ పెద్దదానికి మాత్రం ఏం వయసుంది? దాని ఆటల్లో అది ఉంటుంది. వేళకు పెట్టటం - అవి దానికి ఏం తెలుస్తుంది. తిండిలో బలం తక్కువై బిడ్డకు ఈ నంజు వచ్చింది అని డాక్టరమ్మ అంటుంది.

మంగమ్మ : వేళకు తిండి పెట్టకపోతే నంజు వస్తుందా? ఏమొచ్చినా పదో పాతికో వదిలితేగాని పోదుకదా!

రా : డబ్బు కాదమ్మా. ఎక్కడైనా అప్పయినా చేసి పెట్టొచ్చు. ఈ బిడ్డ పైవాడు కూడా వంజుతోనే పోయినాడు. అప్పుడూ ఎన్నో చేసినాను. రోగం ముదిరిందన్నది డాక్టరమ్మ. లాభం లేకపోయింది. ఈసారి ముందే డాక్టరమ్మను చూచినాను.

మం : ఏం చెప్పిందామె?

రా : చెప్పడమేకాదు. బొమ్మలు కూడా చూపించింది. నడకొచ్చిన పిల్లలకు బలమైన తిండి ఉండాలట. అన్నం ఒకటి చాల దట. కొంచెం టమాటారసం, కొంచెం వేరుసెనగపప్పు కందిపప్పు, పెసరపప్పు కలిపి మెత్తగా ఉడికించిన అన్నం

తినిపించాలట. కాయగూరలూ ఆకుకూరలూ పెట్టాలట. పండ్ల రసం యిస్తే చాల మంచిదట.

మం : అట్లాగా? ఆకుకూరలు తినబెట్టిన పసరు పెరుగతుంది అని

అంటుంది మా అత్తమ్మ. పండ్ల రసం యిస్తే జలుబు చేస్తుంది అంటుంది.

రా : పాతకాలపోళ్లు అట్లాగే అంటారు. ఆకు కూరలు తింటే బాగా నెత్తురు పడుతుంది. కళ్లకు మంచిది కూడా. అవి తినకపోతే కంటిలో పువ్వులేచి చూపు పోయినోళ్ళు ఉన్నారు. చూడు, అని ఎన్నో బొమ్మలు చూపించింది డాక్టరమ్మ.

మం : అట్లానా? మా ఆడబిడ్డ కొడుక్కు రాత్రి చూపానదు.

రా : హెల్తు సెంటరుకు తోడుకొని పొమ్మను. తప్పకుండా బాగవుతుంది. మన జబ్బులకు చాలవరకు తిండిలోపమే కారణం అంటుంది డాక్టరమ్మ. మనకు అందుబాటులో ఉన్న వాటితోనే మనం మంచి బలమైన ఆహారం తయారు చేసుకోవచ్చట. డాక్టరమ్మ ఓపికగా అన్ని విషయాలు విపులంగా చెపుతుంది.

# నలుగురు కలిస్తే

గాలివాన వచ్చింది. రామాపురంలో యిళ్ళన్నీ పడిపోయాయి. పాకలు కూలి పోయాయి. వాటిలో బడి పాక ఒకటి. ఊళ్ళోవాళ్ళంతా మెల్ల మెల్లగా పాకలు వేసుకున్నారు. ఇళ్ళు కట్టుకున్నారు. ఒకనాడు మేష్టరు బడి పిల్లలకు పడిపోతూ ఉన్న పాక చూపించాడు.

"ఎంతసేపో చెట్టు కింద కూర్చుని చదవడం మాకు కష్టంగదా సార్! ఎలాగైనా పాక వేసుకోవాలి సార్" అన్నారు పిల్లలు.

"అవును మనందరం కలిసి కష్టపడితే మనమే స్కూలు పాక వేసికోగలం. అందుకు మీరంతా తలొక పనీ చేయాలి" అన్నారు మాష్టారు.

మాష్టార్యా, కర్ర తెద్దాం. పైన కప్పటానికి తాటాకులు కూడా ఉన్నాయి" అన్నాడు గంగయ్య.

"అలాగే. అయినా మీ పెద్దవాళ్ళ నడగందే తేకూడదు. మీ నాన్నను నేను అడుగుతాను" అన్నారు మాష్టారు.

"మరి పాకకు చుట్టూ తడిక కావాలికదా సార్?" అంటూ అడిగాడు రంగడు.

"ఎల్లన్న తడికలు అల్లుతాడండి. ఎల్లన్నను తెమ్మంటే" అన్నాడు గంగయ్య.

"పాపం వాళ్ళు చాల పేదవాళ్ళంటే" అన్నాడు రంగడు.

"అయితే ఓ పని చేద్దాం. ముందు కొంత డబ్బు పోగు చేద్దాం. అందులో డబ్బు వాసాలకు, తడికలకు, తాళ్ళకు ఇద్దాం" అన్నారు మాష్టారు.

మాష్టారు ఇంటింటికి తిరిగి చందాలు పోగు చేశారు.

గంగయ్య తాటితోపు నుంచి దూలాలు వచ్చాయి. బుచ్చయ్య తాళ్ళు తెచ్చాడు. వాసాలు కొన్నారు. ఎల్లన్న తడికలు అల్లాడు. తాటాకు కూడ తెచ్చారు.

పది రోజుల్లో పాక తయారయింది. పాకలోపల నేల చదును చేశారు. చక్కగా అలికారు. ఆడ పిల్లలు ముగ్గులు పెట్టారు.

ఊరి పెద్దలొచ్చారు. కొబ్బరి కాయలు కొట్టారు. పిల్లలంతా ఆనందంతో చప్పట్లు కొట్టారు. హాయిగా నీడలో బడి సాగింది. పిల్లలంతా కలిసి వేసిన ఆ పాక ఆ పల్లెకే ఆదర్శంగా నిలిచింది.

# దాచుకోవడం నేర్చుకోండి

రంగాపురం ఒక చిన్న ఊరు. ఆ ఊళ్ళో రామయ్య యాదయ్యలు రైతులు. ఇద్దరికి అయిదేసి ఎకరాల పొలముంది. ఆయిద్దరూ పొలాన్ని చక్కగా సాగు చేశారు. మేలైన విత్తులు చల్లారు. పంట బాగా పడింది. ఆ ధాన్యం నిలువ చేశారు. ధర బాగా ఉన్నప్పుడే అమ్మాలనుకున్నారు.

రామయ్య తన దొడ్లో గుండ్రంగ మూడుఅడుగుల ఎత్తున మెరక వేశాడు. దాని చుట్టూ సిమెంటు చేయించాడు. పైన నాపరాళ్ళు పరిచాడు. ఎండుగడ్డి ఒత్తుగా వేశాడు. పురుగు పట్టకుండా మందు చల్లాడు. పైన ప్లాస్టికు కాయితం పరిచాడు. ధాన్యం పోసి చుట్టూ గడ్డి వెంటితో బిగించి పురి కట్టాడు.

యాదయ్య తన ధాన్యం బస్తాలతో యింటికి తెచ్చాడు. ఇంట్లో ఒక గదిలో ఆ బస్తాల్ని నిలువ చేశాడు. తలుపు వేసి గదికి తాళం కూడా వేశాడు.

నాలుగు నెలలు గడిచాయి. ధాన్యం ధర హెచ్చింది. రామయ్య ధాన్యం పురి నుంచి తీశాడు. ఒక్క గింజ కూడా పాడు కాలేదు. ధాన్యం అమ్మి రామయ్య లాభం పొందాడు.

యాదయ్య ధాన్యం తీయటానికి గది తలుపులుతెరిచాడు తీయగానే ఎలుకలు యాదయ్య మీదికే దూకాయి. వడ్ల చిలకలు చుట్టూ ఎగిరాయి. కొంత ధాన్యం ఎలుకలు తిన్నాయి. కొంతధాన్యం కన్నాల్లోకి తోసేశాయి. కొంత ధాన్యం రంగుమాసి పాడైపోయింది. ఆ ధాన్యం ధర పలుకలేదు. యాదయ్య నష్టపడ్డాడు. దాంతో కుంగిపోయాడు.

రామయ్య దగ్గర కెళ్ళాడు. బాధపడుతూ జరిగిందంతా చెప్పాడు. రామయ్య విన్నాడు.

"యాదయ్యా! పండించగానే సరిపోతుందా? పంటను సరిగ్గా కాపాడుకోక పోతే ఇట్లాగే పాడైపోతుంది. దీనివల్ల మనకే కాదు దేశానికి కూడా నష్టమే! ఎక్కువ పంట పండించడం ఎంత అవసరమో పండించిన పంటను కాపాడు కోవడం అంతకన్నా ఎక్కువ అవసరం" అన్నాడు రామయ్య.

"అదేనాకు తెలియలేదు రామయ్యా! అన్నాడు యాదయ్య దీనంగా.

"మనకు తెలియకపోతే తెలిసిన వాళ్ళ నడగాలి. నేను మూడు అడుగుల యెత్తున పురి కట్టాను. మందు చల్లాను. ప్లాస్టిక్ కాగితం చుట్టాను" అన్నాడు రామయ్య. ఒకసారి మా యింటికిరా ఏం చేసానో చూద్దువుగాని"

అయితే యీసారి కొంత ఖర్చయినా నేను అట్లాగే చేస్తాను" అన్నాడు యాదయ్య.

"అబ్బే! ఈ నష్టంతో పోలిస్తే అది పెద్ద ఖర్చేంకాదు" అన్నాడు రామయ్య.

ఆ తరువాత యాదయ్య కూడా రామయ్యలాగే ధాన్యం నిలువ చేశాడు. నష్టపోకుండా బాగు పడ్డాడు.

# వంట - పోషకాహారము

జానకి పట్నంలో చదువుతూ ఉంది. సెలవలకు పల్లెకు వచ్చింది. ఇంట్లో అడుగు పెట్టింది. ఇల్లంతా పొగ. అమ్మ వంట గదిలో వంటచేస్తూంది. పట్నంలో వాళ్ళ ఎంత సులువుగా వంట చేసుకొంటారు! మన యింట్లో కూడ కొత్తరకం పొయ్యి పెట్టు కుంటే ఎంత బాగుంటుంది అనుకుంటూ దొడ్లోకి వెళ్ళింది జానకి. అమ్మను పలకరించింది. వెళ్ళి స్నానం చేసింది. బట్టలు మార్చుకొంది.

అమ్మ అన్నానికి పిలిచింది. జానకి అమ్మ వడ్డించిన అన్నంతింటూ ఉన్నది: "వంట చెయ్యడంలో ఎన్నో కొత్త పద్ధతులు వచ్చినా

యమ్మా" అన్నది అన్నం కలుపుకొంటూ. "చేసేది వంట. కొత్తేమిటి? పాతేమిటి?" అన్నది అమ్మ. "అట్లా కాదమ్మా. ఇందాక నీవు గంజి వార్చినావుగదా. అట్లా చేయకూడదు. గంజితో సారమంతా పోతుందట. అన్నానికి దంపుడు బియ్యమైతే ఇంకా మంచిదట. బియ్యంకంటె గూడా జొన్నలూ, గోధుమలూ బలాన్ని ఇస్తాయట. పిండి ఎక్కువగా జల్లించ గూడదట. అట్లయితే ఇంకా మంచిదట. ఇంకా కూరలున్నాయనుకో. ఆకులుగాని, కాయలుగాని, తరగక ముందే బాగా కడగాలట. తరిగిన తర్వాత కడిగితే అందులో సారం పోతుందట. కూరలు ఎంత తాజాగా ఉంటే అంత మంచిదట.

"బీర, పొట్ల, పొర వంటి కాయగూరలు ఉడకబెడతాం గదా అప్పుడు వాటి నుంచి నీళ్లు ఊరతాయి. ఆ నీళ్ళు పారబోయకూడదు ఆ నీళ్లలో ఎంతో సత్తువ ఉంటుంది. అవి పులుసులోనో చారులోనో కలిపి చేస్తే మంచిదట. మనం పెట్టే తాలింపు, మసాలావల్ల ఆహారానికి మంచి రుచీ, వాసనా వస్తాయట. దోసకాయ, టోమాటో పళ్లూ ఉడకబెట్టకుండా పచ్చివే తినడం మంచిదట. వీటికి తోడు పండ్లూ, పాలూకూడా ఎక్కువగా ఉపయోగిస్తే ఆరోగ్యానికి మంచిదట. ఇవికూడా ఎంత తాజాగా ఉంటే అంతమేలు. ఆహారాన్ని ఉంచుకొనే పాత్రలు శుభ్రంగా కడిగి, తుడిచి ఉంచుకోవాలి. వడ్డించుకొ

నేటప్పుడు చేతులతో తాకడం మంచిదికాదు. చెమ్చాలూ, గరిటెలూ వాడుకొంటే బాగుంటుంది. పాత్రల మీద మూతలు పెట్టడం మరిచిపోగూడదు". అన్నది జానకి అన్నం తింటూ.

జానకి చిన్న వయసులోనే యిన్ని విషయాలు తెలుసు కుంది అని వాళ్ళ అమ్మ చాల సంబరపడింది.

ఇవన్నీ తప్పకుండా చేస్తాం గానీ ముందు నీ భోజనం కానియ్యి అని గుర్తు చేసింది అమ్మ.

# అంటు వ్యాధులు

అది ఒక చిన్న ఊరు. ఆ ఊళ్ళో అమ్మవారి దేవాలయం కొండపై ఉంది. ప్రతి ఏడు మార్చి నెలలో అక్కడ తిరణాల జరుగు తుంది. ఊరేగింపులు, భజనలతో ఊరంతా కళ కళ లాడుతుంది. ఒకసారి తిరణాల రోజుల్లో కలరా వ్యాధి వ్యాపించింది. అమ్మ వారికి ఎన్నో పూజలు చేశారు. ఎన్నో ఏటలు బలి ఇచ్చారు. అయినా ఆ అంటువ్యాధి అంతటా పాకిపోయింది. చాలమంది పిల్లలు పెద్దలు చచ్చిపోయారు. ఊళ్ళో వాళ్ళంతా భయపడి పోయారు.

ఏడాది గడిచి పోయింది. మళ్ళీ తిరణాల వచ్చి

అయినా ప్రజలలో యింకా భయం తగ్గలేదు. మళ్లా కలరా వస్తుందేమోనని భయమే. కలరాకి భయపడి తిరణాల మానేద్దా మనుకున్నారు. మానేయడానికి మళ్లా భయమే. ఆసమయంలో ఆ ఊళ్లోకి రమేశ్ అనే డాక్టరు వచ్చాడు. వాళ్ళంతా ఆయన సలహా అడిగారు. ఆయన అంటు వ్యాధులు ఎట్లా వ్యాపిస్తాయో చెప్పాడు. "ఈగలు వాలిన ఆహారం తినకండి. నీటిని శుభ్రంగా కాచి తాగండి. ఏ అంటు వ్యాధీ మీ ఊళ్లో వ్యాపించదు" అన్నాడు డాక్టరుగారు.

ఆ ఊరి మునసబు డాక్టరు చెప్పిన మాటలను చాటింపు వేయించాడు. అంతా అలాగే చేశారు. తిరణాల అతివైభవంగ జరిగింది. ప్రజలెంతో ఆనందించారు.

ముఱుగువల్ల పురుగులు పెరుగుతాయి. పురుగులవల్ల

జబ్బులు వస్తాయి. పురుగులు పెరగకుండాచేస్తే జబ్బులు రావు. రోగం నయం చేసే కన్న రోగం రాకుండా చూడడం మంచిది. ఏటలవల్ల రోగాలు పోవు. ఈ విషయాలన్నీ డాక్టరుగారు చెప్పారు. ఆ ఊరి వాళ్ళంతా వారి మాట నమ్మారు. ఆ ఏడు వ్యాధులు రాలేదు. వారికి డాక్టరు మీద నమ్మకం పెరిగింది. అంటు వ్యాధులను రాకుండా కాపాడు కున్నారు.

వ్యాధి నివారణ కన్న
వ్యాధి నిరోధమె మిన్న

# గాంధీ తాత

అక్క : చిట్టి చిట్టి పాపలు

గాంధీ బొమ్మను చూశారా

గాంధీ బొమ్మను చూచారా

చిన్న చిన్న బాబులూ

బాపూ కథనే విన్నారా !

(పిల్లలంతా కలిపి) మన జాతి పిత గాంధీజీ

అందరి తాతా గాంధీజీ ।మన।

పాప : అక్కా,గాంధీతాత కథ చెప్పక్కా

| | | |
|---|---|---|
| అక్క | : | చెబుతున్నా నిదిగో<br>ఒక చిన్న కథ<br>గాంధీతాత<br>చిన్ననాటి కథ |
| బాబు | : | ఏం కథక్కా అదీ |
| అక్క | : | బాపూ మీా అంత ఉన్నప్పుడు<br>బడికి వెళుతూ ఉన్నప్పుడు<br>ఒక్క నాటకం చూశాడూ<br>చక్కని నాటకం చూశాడు ! |
| పాప | : | ఏం నాటక మక్కా అది |
| అక్క | : | మీారందరు విన్న కథే అది<br>సత్య హరిశ్చంద్రుని కథ అది<br>గాంధీ చూచిన నాటక మదే<br>గాంధీ మెచ్చిన నాటక మదే. |
| బాబు, పాప | : | చూచి |
| అక్క | : | సత్యహరిశ్చంద్రుని వలెనే తాను<br>సత్యమె ఎప్పుడు పలికేటందుకు<br>కష్టా లెన్నో ఎదురైనా<br>ధైర్యముతో నిలవాలను కున్నాడు. |
| బాబు, పాప | : | గాంధీ తాత ఏం చెప్పాడక్కా |

అక్క : చెడు నెప్పుడును వినకండి
చెడు నెప్పుడును అనకండి
చెడు నెప్పుడును కనకండి
ఇది గాంధి చెప్పిన మాట
ఇది బాపూ చూపిన బాట.

# కోళ్ల పెంపకం

ఎల్లయ్య : పుల్లయ్యా రోజూ ఒక కోడిగుడ్డు తింటే మంచిదటగా !

పుల్లయ్య : మంచిదే మరి:
రోజూ కోడిగుడ్డు తినటం అంటే మాటలా మనం బీదవాళ్ళంగదా.

ఎ : మా పక్కింటి మంగయ్య ఒక కోళ్ళ ఫారం పెట్టాడు. గుడ్లకు కొదవేలేదు. మన సర్పంచిగారు కోళ్ళ ఫారం పెట్టడానికి మంగయ్యకు సహాయంచేసాడ ట. పద మనం కూడ సర్పంచి దగ్గరకు పోయి ఆయనను అడుగుదాం.
ఇద్దరూ ఊరి సర్పంచి చలమయ్యగారి దగ్గరికి వెళ్లారు

ఇద్దరూ: నమస్కారం చలమయ్యగారు. మాకు కోళ్ళ ఫారం పెట్టాలని ఉంది. మీరు మాకు సహాయం చేయాలి.

చల: ఓ దానికేం? మీకు ఒక్కొక్కరికి యాభై యేసి కోడి పిల్లలను యిప్పిస్తాను. పెంచుకుంటారు గదా?

పుల్ల: అమ్మో! యాభై పిల్లలే! అన్నింటిని ఎట్లా పెంచగలం?

చల: సులభంగా పెంచవచ్చు. కొంచెం ఓపిక ఉండాలి. అంటే మీ పెరట్లో ఒక కోళ్ళగూడు తయారు చేయండి. అందులో యాభై కోళ్ళు పట్టాలి. దానికి రెండు వైపుల జాలీ మరిచి పోవద్దు. బాగా గాలి, వెలుతురు రావాలి.

ఎల్ల: అంత గూడు వెయ్యడానికి మావద్ద డబ్బులు ఎక్కడి వయ్యా!

చల: నేను ఇప్పిస్తానుగా. మీ కోళ్ళు గుడ్లు పెట్టాక ఆ డబ్బు తిరిగి వాయిదాలలో ఇచ్చెయ్యాలి.

పుల్ల: బాగుంది కాని ఆ కోళ్ళను పెంచడం మాకు తెలియాలి గదా.

చల: గూడు శుభ్రంగా ఉండాలి. తడి లేకుండా చెయ్యాలి. దానిలో వరి పొట్టు పరచాలి. కోడి పిల్లలు తల్లి రెక్కల కింద ఉండవు గదా! అందుకని వాటికి వెచ్చగా ఉండేటట్టు చూడాలి.

ఎల్ల : మరి వాటికి తిండో?

చల : కాగితాలు పరిచి మొక్క జొన్నలు, గోధుమలు నూక చేసి వాటి మీద చల్లండి. అయిదు నెలలు పెరిగిన తర్వాత అవి గుడ్లు పెడతాయి. కావలసినన్ని గుడ్లు ఉంటాయి. అప్పుడు మీ బిడ్డలకు ఇవ్వనూవచ్చు మిగిలినవి మార్కెటుకు పంపనూవచ్చు. డబ్బు వస్తుంది. అయితే వీటికి రోగాలు రాకుండా టీకాలు వేయించాలి. ముక్కులు కూడ కత్తిరించాలి. ఇదే మంత పెద్దపని కనక. నేను కూడా అప్పుడప్పుడూ వస్తూ ఏంచేయాలో చెబుతూ ఉంటా. మీకు కావలసిన సహాయంచేస్తా.

పుల్లి: సరేనయ్యా, యాభై యేపి పిల్లలను ఇప్పించండి పెంచుతాం.

# టంగుటూరి ప్రకాశం పంతులు

ప్రకాశం పంతులుగారి పేరు మీరు వినే ఉంటారు. ఆ పేరు వినగానే "ఆంధ్ర కేసరి" అనే బిరుదు గుర్తుకు వస్తుంది. అది ప్రజలు ప్రేమతో ఆయనకు ఇచ్చిన బిరుదు. తెలుసు వాళ్ళలో సింహం లాంటి వాడాయన. ధైర్యంలో, సాహసంలో సింహం వంటివాడు ప్రకాశం పంతులు.

అవి స్వాతంత్ర్య పోరాటం సాగే రోజులు. మద్రాసులో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఒక ఉద్యమం బయలు దేరింది. దానికి ప్రకాశం నాయకుడు. అడుగు ముందుకు వేస్తే తుపాకులతో కాల్చమని ప్రభుత్వం ఉత్తర్వు చేసింది.

సైనికులు తుపాకులు గురిపెట్టినారు. ప్రకాశం పంతులు గారు ముందుకు వచ్చినారు. తనరొమ్ము విరిచి చూపినారు. "ధైర్యముంటే కాల్చండిరా" అని సవాల్ చేసినారు. ఎంత ధైర్యము! ఎంత గుండె నిబ్బరమో ఆయనకు! సైనికులకు ధైర్యం చాలలేదు. తమ తుపాకులు వెనకకు తీసుకున్నారు. ప్రజలందరు ప్రకాశం పంతులుగారిని "ఆంధ్ర కేసరి" అని జేజేలు కొట్టినారు.

ప్రకాశంగారు సామాన్య కుటుంబంలో పుట్టినారు. టంగుటూరు వారి ఇంటిపేరు. తండ్రి గోపాల కృష్ణయ్య. తల్లి సుబ్బమ్మ. ప్రకాశంగారు ఏ పని చేసినా పట్టుదలతో చేసేవారు. ఇంగ్లండు వెళ్ళి పెద్ద వకీలు చదువు చదివినాడు. కీర్తి సంపాదించినాడు. లక్షల కొలది డబ్బు సంపాదించినాడు. దాన్ని మంచి నీళ్ళవలె దేశ సేవకు వినియోగించాడు. లాఠీ దెబ్బలు తిన్నాడు. జైలుకు వెళ్ళినాడు. చివరకు ఆంధ్ర రాష్ట్రానికి తొలి ముఖ్యమంత్రి అయినాడు. ఆయన పదవి ఉన్నా లేకపోయినా ప్రజల మనిషి అనిపించుకున్నాడు. అందుకే ప్రకాశమంటే ప్రజలు. ప్రజలంటే ప్రకాశం అని చెప్పుకొనేవారు ఆయన మనం. ఎప్పుడూ గుర్తుంచుకోదగిన దేశ నాయకుడు - ఆయనవలె ధైర్యం, పట్టుదల త్యాగం మనం అలవరచుకోవలె.

# బలమైన ఆహారం

బాలయ్య : నమస్కారం! డాక్టరు బాబు

డాక్టరు : రా బాలయ్యా కూర్చో! ఏం యాదయ్య నీవు కూడా వచ్చావు

యాదయ్య: అవును బాబు! బాలయ్య నన్ను నీదగ్గర చూపించుకో మన్నాడు.

డా : (పరీక్ష చేసి) నీకేం జబ్బులేదు యాదయ్యా!

బా : మరి ఎప్పుడూ ఏదోరకంగా బాధ అంటాడే!

యా: మూడు పూటల తింటున్నాను డాక్టరు బాబు!

డా : మూడు పూటలు తిండి తినడం కాదు బాలయ్య! ఏమేమి ఎంతెంత తింటున్నారు అన్నదే ముఖ్యం.

యా: ఏమేమి తినటం ఏటండీ ? అన్నం, కూర, పచ్చడి, పెరుగు అన్నీ తింటున్నాను.

బా : మరయితే యీ జబ్బేమి ?

డా : అదే చెప్తున్నా. మన శరీరం బాగా ఎదుగాలంటే ఏరోగం రాకుండా వుండాలంటే మంచి బలంగల తిండి తినాలి.

బా : బలం గల తిండి అంటే ?

డా: బియ్యం ఉందనుకో అవి దంపుడు బియ్యం అయితేనే అందులో బలమిచ్చే పధార్ధముంటుంది.

యా: బియ్యంతో పాటింకేమి వాడాలి ?

డా: ఆకు కూరలు, పండ్లు బాగా తినాలి. పాలుత్రాగాలి.

యా: ఆకు కూరలు మా పెరటో పెంచుతూనే ఉన్నామండీ. కాని వాటిలో తినేందుకేముంటుంది?

డా: పచ్చకూరల్లో, కాయగూరల్లో ఆహారం జీర్ణం చేసే శక్తివుంది. అవి రక్తాన్ని శుభ్రం చేస్తాయి.

బా: మరి పప్పు దినుసులు కూడా తినాలి కదా ?

డా: అవును. వరితో పాటు గోధుమలు, జొన్నలు పప్పు దినుసులు వేరు పెనగలు మొదలగునవి తినాలి. అవే గాక అరటి పండ్లు పాలు, కోడి గుడ్లు వంటివి తినాలి రోజూ ఏదయినా ఒక మంచి పండు తినాలి. చౌకగా వచ్చేది ఏ పండయినా సరే. ఇక ఇవన్ని బాగా వాడి సరిగ్గా సమయానికి తింటే ఏ జబ్బూ రాదు.

యా: అయితే నాకేం మందక్కర్లేదా?

బా: ఇంక మందెందుకు ! డాక్టరు బాబు చెప్పినట్లు తిండి తింటే సరి.

డా: అంతకంటే ఇంకేమీవద్దు. కాని మరొక విషయం. సరియైన సమయానికి మంచి ఆహారం తివ్వా, చుట్టా, బీడి సిగరెట్టుకల్లువంటివి తీసుకుంటే ఆరోగ్యాన్ని పూర్తిగా పాడు చేస్తాయి.

బా: అద్గదీ! అట్లా చెప్పండి బాబు. చాలా విషయాలు చెప్పారు.

ఆ తర్వాత ఇద్దరూ వెళ్ళిపోయారు.

పిప్పి తిండి తట్టెడు కన్న
పుష్టి తిండి పట్టెడు మిన్న.

# సరోజినీ దేవి

హైదరాబాదులో పుట్టిందండి వందయేండ్లనాడు
గానకోకిలా వరదాసుందరి కవికోకిల తల్లి
కాలేజీలో మేటి పండితుడు ఆమె తండ్రిగారు
చిన్నతనాన్నే సరోజినమ్మ పద్యాలల్లేది
వాటిని మెచ్చి కవికోకిలయని పిలువసాగిరంతా
అందరి మెప్పును పొంది చదువుకై ఇంగ్లాండు వెళ్ళింది
ఇంగ్లాండు వెళ్ళిన కవికోకిల తన గొంతు విప్పెనండీ
ప్రజల కోరికలు బ్రతుకుల వెలుగులు సుందర దృశ్యాలు
కవితా విషయాలైనాయండి మనకవి కోకిలకూ, వాటిలో
ఎన్నిక పొందాయండీ ఎన్నో గీతాలు, 'పల్లకి బోయీ' అనెడి
గీతికను ఎందరో మెచ్చారు, "బంగరు గడప" అను కావ్యంబూ
వ్రాసి పేరు పొందె, మన్నన పొందీ కవికోకిల
మన దేశం వచ్చింది, ఆమెను మెచ్చి డాక్టరు నాయుడు

పెండ్లి యాడెనండీ, కులాలు లేని సమాజ మిద్దరు ఆరంభించారు.

హిందూదేశం పలు మతాలకు ఉనికి పట్టు నేడు

హిందూముస్లిం భేదాలెంచుట తగదు తగదు నేడు

మతాన్ని మరిచి అందరమొకటై ముందుకు పోవాలి.

అంటూ నమ్మిన కవికోకిలతా దీక్షను పూనింది

గాంధీమార్గం జాతీయతనే ఊపిరియైనాయి

జైలుకు పోవుట మామూలైనది భారత కోకిలకు

యుగాల తరబడి బానిస బ్రతుకులో స్త్రీలుంటేనూ

ఊరకె ఉండుట తగదని ఆమె శంఖం ఊదింది

స్త్రీలు, పురుషులు అందరు కూడా సమానమేనండీ

అంటూ స్త్రీలను ముందుకు తానూ నడిపించిందండీ

భారత కోకిల సరోజినీ సతి తాను ధన్యురాలు

తరతరాలకు స్త్రీ పురుషులకూ ఆదర్శం తాను.

# ఇంటి తోట

రంగయ్య భార్య రామమ్మ. వాళ్ళది పేద కుటుంబము. ఒకరోజు రామమ్మ అన్నం వండింది. పిల్లలకూ మగనికి పెట్టింది. అప్పటికి పొద్దు తిరిగింది. రంగయ్య పనిలోకి పోయినాడు. పిల్లలు బడికి పోయినారు. రామమ్మ ముచ్చటలకు పక్కింటికి పోయింది. అప్పుడు కమలమ్మ పెరట్లో ఉంది.

రామమ్మ : కమలమ్మొదినా, పెరట్లో ఏం చేస్తున్నావు?

కమలమ్మ: ఇక్కడ పాదులు చేస్తున్నా వదినా. సాయంత్రం మీ అన్న వచ్చేటప్పటికి ఈ పని అయిపోవాలి.

రామమ్మ : తర్వాత చేసుకోవచ్చులే కొంచెం సేపు గప్పాలాడు కొందాము.

కమలమ్మ: గవ్వలాడితే ఏమి వస్తుంది, కూరలు కొనలేకపోతున్నాం ధరలు మండిపోతున్నాయిగదా। పెరట్లో నాలుగైదు రకాల మొక్కలు వేసుకుంటే కూరలు కొనకుండా సరిపోతుంది. మీకూ పెద్ద పెరడు ఉంది. ఏమి పెట్టి నట్టేలేదే.

రామమ్మ : పెరడేమో పెద్దదే. నిరుడు మొక్కలు వేస్తే సరిగా కాయలేదు, అందుకని ఈసారి పెట్టలేదు.

కమలమ్మ. మరి మీరు కూర లెట్లా చేస్తున్నారు?

రామమ్మ : రోజూ కొనలేక నాలుగైదు రోజులకు ఒకసారి ఏవైనా కూర చేసుకొంటాము.

కమలమ్మ: అయితే రోజూ కూరలు చేసుకోరన్నమాట.

రామమ్మ : లేదు వదినా ఏదో వచ్చడో, చారో చేసుకుంటాం.

కమలమ్మ: అది అంత మంచిది కాదు వదినా. మేమేం చేస్తామో చెప్పనా?

రామమ్మ : చెప్పు వదినా

కమలమ్మ: నేలను త్రవ్వి పాదులు చేయడం మీ అన్న చేస్తారు. పాదుల్లో గింజలను నేను పెడతాను. పిల్లలు కలుపు మొక్కలు తీసివేస్తారు. కోళ్ళు పాడు చేయకుండా

చూస్తారు. రోజూ పొద్దుననో సాయంత్రమో తీరిక ఉన్నప్పుడు మొక్కలకు నీళ్ళుపోస్తూఉంటాము. స్నానం చేసిన నీళ్ళూ, చెంబులు తోమిన నీళ్ళూ ఊరికే పోనీయము. కాలువలుచేసి పాదుల్లోకి పెడతాము. తోట కూర, గోంగూర, మెంతికూర, పాలకూర ఏదో ఒకటి ఎప్పుడూ ఉంటుంది. కాయగూరలు కూడా ఏకాలంలో పండేవి ఆ కాలంలో వేస్తూనే ఉంటాం. ప్రతిరోజూ తాజా కూరలు దొరికినట్లూ ఉంటుంది. ఎంత లేదన్నా రోజుకు ఒక్క రూపాయ మిగులుతుంది. పెరడు ఎప్పుడూ పచ్చగా ఉంటుంది. తాజాకూరలు తినడంవల్ల పిల్లల ఆరోగ్యం కూడా బాగుంటుంది.

రామమ్మకు కమలమ్మ మాటలు బాగా నచ్చినాయి. చిక్కుడు బీర, కాకర గింజలను పెట్టించుకొని తమ పెరట్లో పెంచడానికి తీసికొని వెళ్ళింది.

# ఆత్మ విశ్వాసం

విజయపురి అనే ఒక పల్లె. ఆ పల్లెలో శీనయ్య అనే పిల్లవాడు గొర్రెలను కాచుకుంటూ ఉండేవాడు. ఒకనాడు బడి పంతులు గోపయ్యగారు సాయం కాలం షికారు పోతూ దారిలో శీనయ్యను చూశాడు. వాడు ఏవో పాటలు చక్కగా పాడుకుంటూ వస్తున్నాడు. గోపయ్యగారు వాడి దగ్గరగా వెళ్ళి "శీనయ్యా! నువ్వు చాలా బాగా పాడుతున్నావు. ఏదీ ఈ పాట పాడు అంటూ తన చేతిలోని పుస్తకంలో పాట చూపించాడు.

"నాకేం రాదయ్యా! ఏదో అనోటా ఈనోట విని పాడు తుంటాను. విన్న పాటలే పాడగలను" అన్నాడు. "నువ్వు అలా ఎందుకు అనుకోవాలి. నీవు చక్కగా చదువుకుంటే ఇంకా ఎన్నో పాటలు పాడ గలవు. పాడటమే కాకుండా

అలాంటి పాటలు రాయగలవు కూడా! రోజూ నాదగ్గరకురా! కొంచెం కొంచెం నేర్చుకొందువుగాని" అని మాష్టరు శీనయ్యను ఉత్సాహపరిచాడు.

"మా అయ్య చదవలేదు, మా తాత చదవలేదు మా ఇంటా వంటాలేని చదువు నాకు ఎట్లా వస్తుంది. నువ్వే చెప్పయ్యా?" అన్నాడు శీనయ్య.

"అట్లా అనుకోకు నాయనా! నీవు కాస్త ఓపిగ్గా నేర్చుకుంటే కావలసినంత చదువు వస్తుంది. అలా నీరస పడకూడదు." చదువు కుంటె లెక్కలు కూడా తెలుస్తాయి అన్నారు మాష్టరు.

"నా కొద్దయ్యా" నేను చదువుకొని ఉద్యోగాలు చేయాలా ఊళ్ళేలాలా అన్నాడు శీనయ్య. చదువు కోవడం ఉద్యోగాలకేనా! నీకు చదువు వస్తే ఈ పాట కూడా పాడేవాడివి' అన్నారు మాష్టరు·'నాకు చదువురాదు. అది నాకొద్దయ్యా' అన్నాడు శీనయ్య.

'నీ ఊహ సరికాదు శీనయ్యా! చదువు రాకపోతే లెక్క చూడ్డం,జాబు చదవడం, నీకు చేతకాదు. అప్పుడు నువ్వు ఎవరి నైన అడగాలి. నీకే గనుక చదువు వస్తే ఎవ్వరినీ అడిగే పనిలేదు· రోజూ సాయంత్రం నాదగ్గరకు రా! నీకు అన్నీ చెప్తాను. నువ్వు బాగా చదువు కొంటే పాటలు పద్యాలు ఇంకా బాగా పాడగలవు అంటూ ధైర్యం చెప్పాడు.

మాష్టరు మాట మీద శీనయ్యకు గురి కుదిరింది. ఆయన చెప్పినట్టే రోజూ ఆయన దగ్గర కెళ్ళాడు. మెల్ల మెల్లగా అక్షరాలు, మాటలు, వాక్యాలు చదవడం రాయడం నేర్చు కున్నాడు. రెండేళ్ళకు శీనయ్యకు రాయడం బాగా వచ్చింది. ఇప్పుడు శీనయ్య ఏ పుస్తకమైనా చదవగలడు. ఏ పాటయినా చదివి పాడగలడు.

# వీరేశలింగం పంతులు

తరతరాలుగ బానిసలుగా
బ్రతుకుచుండిన ఆడవారిని
బడులలో చేర్పించి చదువుల
నేర్వ జేసిన అతడెవరమ్మా?
అతని పేరు చెప్పమ్మా.

జంకుగొంకులు లేక తనమది
నున్నయాలోచనల నన్నిటి
లోకమంతకు తెలియజేసిన
మేటి వీరుండాతడెవరమ్మా?
ఆతని పేరు చెప్పమ్మా.

నాడులన్నిట తెలుగునాడు

బాసలందున తెలుగు బాసా
ముందుముందుగ నుండవలెనని
చాటి చెప్పిన మేటి ఎవరమ్మా?
అతని పేరు చెప్పమ్మా.

ఆతడే వీరేశలింగము
అతని కంటే గొప్పదాతా
అతని కంటే గొప్పనేతా
ఎవరు లేరమ్మా వేరెవరు లేరమ్మా.

| | |
|---|---|
| 1 | ఒకటి |
| 2 | రెండు |
| 3 | మూడు |
| 4 | నాలుగు |
| 5 | ఐదు |
| 6 | ఆరు |
| 7 | ఏడు |
| 8 | ఎనిమిది |
| 9 | తొమ్మిది |
| 10 | పది |

| | | |
|---|---|---|
| 11 | పదకొండు | (పది ఒకటి) |
| 12 | పన్నెండు | (పది రెండు) |
| 13 | పదమూడు | (పది మూడు) |
| 14 | పధ్నాలుగు | (పది నాలుగు) |
| 15 | పదిహేను | (పది ఐదు) |
| 16 | పదహారు | (పది ఆరు) |
| 17 | పదిహేడు | (పది ఏడు) |
| 18 | పద్ధెనిమిది | (పది ఎనిమిది) |
| 19 | పంధొమ్మిది | (పది తొమ్మిది) |
| 20 | ఇరవై | |

| | |
|---|---|
| 10 | పది |
| 20 | ఇరవై |
| 30 | ముప్పై |
| 40 | నలభై |
| 50 | యాభై |
| 60 | అరవై |
| 70 | డెబ్బై |
| 80 | ఎనభై |
| 90 | తొంభై |
| 100 | నూరు (వంద) |

| | |
|---|---|
| 26 | ఇరవై ఆరు |
| 34 | ముప్పైనాలుగు |
| 47 | నలభై ఏడు |
| 52 | యాభై రెండు |
| 68 | అరవై ఎనిమిది |
| 75 | డెభై అయిదు |
| 81 | ఎనభై ఒకటి |
| 99 | తొంభై తొమ్మిది |